# జవహరలాల్ అధికార స్వీకారం

1 వ పేజీ తరువాయి

నుంచి సేను విరమిస్తున్న ఈ సమయంలో స్వాతంత్ర్య సమర ప్రసక్తి లేకుండానే స్వాతంత్ర్య ప్రాంగణాన్ని చేరగలిగామని చెప్పడానికి వీలైనందుకు సంతోషిస్తున్నాను. త్వరలోనే వచ్చివేస్తున్న స్వాతంత్ర్యాన్ని ఆచరణలో పెట్టుకోవడమే మనం చేయవలసినపని. గమ్యస్థానాన్ని చేరడానికి ఇక మనం ఒకే ఒక అడుగు ముందుకు వేయవలసివున్నది.

బ్రిటిషు మంత్రిత్రయంలో రాజ్యాంగ రాయబారాలను జరిపే సందర్భంలో కాంగ్రెసు కార్యవర్గం ఏ. ఐ. సి. సి. తో సంప్రతించలేదని విమర్శిస్తున్నారు. ఇది తప్పుడు విమర్శ అని చెబుతున్నాను. ఇప్పుడు నిర్ణయాలను చేసిన తర్వాతనే కాంగ్రెసు కార్యవర్గం ఏ. ఐ. సి. సి. ని సమావేశపరుస్తున్నది. కాంగ్రెసు కార్యవర్గ తీర్మానానికి ఏ. ఐ. సి. సి. ఆమోదాన్ని పొందాలన్నదే ఈ విధంగా సమావేశం జరపడంలోని ఉద్దేశం.

బ్రిటిషు అమాత్యత్రయంతో కాంగ్రెస్ కార్యవర్గం 3 నెలలపాటు రాయబారాలు జరిపిచేసిన తీర్మానాలను సహృదయతతోనూ, నిష్పక్షపాతమైన బుద్ధితోనూ పరిశీలించి, దేశానికి ఉత్తమ క్షేమకరమని తోచిన పద్ధతిలో కాంగ్రెస్ కార్యవర్గం తనబాధ్యతలను నిర్వహించిందో లేదో గమనించవలసిందని ఏ. ఐ. సి. సి. సభ్యులను కోరుతున్నాను."

ఈ ఉపన్యాసాన్ని ముగించిన తర్వాత అధ్యక్ష పదవినుంచి తాను విరమిస్తున్నట్లు, ఆజాద్ సభికులకు తెలియజేశాడు రాష్ట్రపతి గద్దెయెక్క వలసిందని నెహ్రూను ఆహ్వానించాడు. ఇద్దరు అధ్యక్షులూ హృదయపూర్వకంగా కరస్పర్శ చేసుకున్నారు.

కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ఆచార్యకృపలానీగారు గత సమావేశపు వివరాలను సభ్యులకు నివేదించారు.

కరతాళధ్వనులు, జై, జైనినాదాలు మిన్నుముట్టగా పండిట్ నెహ్రూ అధ్యక్షస్థానాన్ని అలంకరించాడు.

## పటేల్ ప్రశంస

రాష్ట్రపతిగా ఆజాద్ నిర్వహించిన కార్యకలాపాలనూ, ఆయన కనబరిచిన సామర్థ్యాన్నీ, చాకచక్యాన్నీ ప్రశంసిస్తూ సర్దార్ పటేల్ కొంచెం సేపు ఉపన్యసించాడు:

పటేల్ ఉపన్యాససారాంశం:

"ఆరు సంవత్సరాల పాటు నిరంతరాయంగా ఒకే వ్యక్తి రాష్ట్రపతి స్థానంలో పనిచేయడం కాంగ్రెసు చరిత్రలో ఇదే ప్రప్రథమం. ఈ అపూర్వగౌరవం ఒక్క మౌలానా ఆజాద్ కే లభ్యమైంది ఈ ఆరు సంవత్సరాలలో కాంగ్రెసు అనేక చిక్కులను ఎదుర్కొనవలసి వచ్చింది. మౌలానా ఆజాద్ అతిసామర్థ్యంతో నాయకత్వం వహించి ఈ చిక్కులన్నిటిని కాంగ్రెసు దాటేటట్లు చేయగలిగాడు.

1942 ఆగస్టులో "క్విట్ ఇండియా" తీర్మానాన్ని చేసిన తర్వాత, మేమందరమూ అహమ్మదనగర్ కోటలో మూడేళ్ల పాటు కలసివున్నాము! విడుదలయిన తర్వాత సిమ్లాలో మరికొన్ని వారాల పాటు కలసిమెలసి వున్నాము. తిరిగి అమాత్యత్రయముతో ఈ మూడు నెలల రాయబారాలనూ కలిసే నిర్వహించాము. మౌలానా ఆజాద్ రాత్రింబగళ్లు శ్రమపడి పనిచేయడము నేను గమనించాను. గత ఆరు సంవత్సరాలలోనూ మౌలానా ఆజాద్ తానాక్రమించిన ఉన్నత పదవి గౌరవ ప్రతిపత్తికి, భంగకరంగా ఏ ఒక్కసారికూడా ప్రవర్తించలేదు. కాంగ్రెసు మహాసంస్థ ప్రతిష్ఠకు ఏమాత్రము భంగంవాటిల్లకుండా ఆయన వహించజాలని విషయం. ఆరు దీర్ఘ సంవత్సరాల పాటు మౌలానా ఆజాద్ రాష్ట్రపతిగా తన బాధ్యతలను ధైర్య స్థైర్యాలతో నిర్వర్తించాడు. మరెవరైనప్పటికీ ఇంతటి ధైర్యాన్నిగాని, ఇంతటి ధీరసంకల్పాన్నిగాని బహుశా చూపివుండలేక పోయేవారే.

మన దేశస్వాతంత్ర్య సమరంలో ఈ నాటికి ఈ పరిస్థితికి రాగలిగామంటే, ఆ గౌరవం, బాధ్యతపూర్తిగా ఆజాదుదే. "1942 లో బ్రిటిషువారు భారతదేశం నుంచి వైదొలగడం అవసరమన్నాము. వైదొలగడానికి సిద్ధంగా వున్నామని వారు ఇప్పుడు అంటున్నారు. బ్రిటిషువారు ఏ విధంగా వైదొలగితే బాగుంటుందో సాధనోపాయాలను ఇప్పుడు మనం చర్చిస్తున్నాము. బ్రిటిషువారు సౌమ్యంగానూ, సులభంగానూ ఈ దేశంనుంచి వెళ్లిపోయేటట్లు చేసేపద్ధతిని ఆలోచిస్తున్నాము." మనం ఇంతపని సాధించగలిగామంటే, ఇందుకు మౌలానా ఆజాద్ ను ఆయన కృషిని ఎంతైనా ప్రశంసించకతప్పదు."

## పంత్ ప్రస్తుతి

తర్వాత గోవిందవల్లభపంత్ ప్రసంగించాడు. "కాంగ్రెస్ మహాసంస్థను మౌలానా ఆజాద్ అద్భుతమైన చాకచక్యంతోనూ, ధీటితోనూ, గౌరవ ప్రతిపత్తులతోనూ నడిపాడు. ఆజాద్ రాష్ట్రపతిగా వున్న ఆరు సంవత్సరాలలోనూ మహత్తరసంఘటనలు జరిగినవి.

"మొదట వ్యక్తి సత్యాగ్రహోద్యమం వచ్చింది; ఆతర్వాత క్రిప్సు రాయబారం జరిగింది. క్రిప్సుతో జరిగిన రాయబారాల సందర్భంలో మౌలానా ఆజాద్ అద్భుతమైన రాజనీతిజ్ఞతను కనబరిచాడు. క్రిప్సు రాయబారం విఫలమైన కొంతకాలానికి మౌలానాసాహెబు నాయకత్వం క్రింద కాంగ్రెసు 1942 ఆగస్టులో 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని చేసింది. ఒకవైపు గృహచ్ఛిద్రాలు వున్నప్పటికీ, మరొకవైపు ఆరోగ్యం చెడిపోతున్నప్పటికీ, వాటిని లెక్కచేయకుండా మౌలానా ఆజాద్ 1942 ఉద్యమానికి నాయకత్వం వహించి, భారతదేశాన్ని స్వాతంత్ర్య ప్రాంగణానికి చేర్చగలిగాడు. మనప్రస్తుత స్థితికి ఆయన నాయకత్వం అమోఘమైన దోహదమిచ్చింది. ఇట్టి మన మౌలానా సాహెబు చిరంజీవియై వర్ధిల్లుగాక అనీ, అచిరకాలంలోనే స్వతంత్ర భారతదేశాన్ని వీక్షించుగాక అనీ భగవంతుని ప్రార్థిస్తున్నాను."

## నెహ్రూ ఉపన్యాసం

నూతన రాష్ట్రపతి పండిట్ నెహ్రూ ఇలా ఉపన్యసించాడు:

"రాంఘర్ కాంగ్రెస్ లో తుపాను చెలరేగింది. మౌలానా ఆజాద్ అధ్యక్షత వహించిన గత ఆరుసంవత్సరాల పరిస్థితినీ తుపానుతో పరిపోల్చవచ్చు. ఇవి కాంగ్రెస్ చరిత్రలోనూ, భారతదేశ చరిత్రలోనూ అతి ప్రధానమైన సంవత్సరాలు. దేశంలో మహత్తరమైన విప్లవం చెలరేగిన సంవత్సరాలు. కార్యభారాన్ని అంతటి సామర్థ్యంతో, అంతటి ధైర్య స్థైర్యాలతో నిర్వహించి, మౌలానా ఆజాద్ అమితగుణాలలో నవీనతను రుజువులో మగెవరున్నారు? నామటుకు నేను, కాంగ్రెస్ అధ్యక్షబాధ్యతను స్వీకరించడమా మానడమా అనే సందేహంలోపడి చాలా రోజులపాటు ఒకనిర్ణయానికి రాలేకపోయినాను. నిన్నగాక మొన్న మహాత్ముని కలుసుకున్నప్పుడు, ఆయన ఇచ్చిన సలహాను, కార్యవర్గంలోని మిగతా సహచరులు ఇచ్చిన సలహాను పాటించి, విధిలేక బాధ్యత స్వీకరించవలసిందేనని నాకు నేనే నచ్చజెప్పుకున్నాను.

భారతస్వాతంత్ర్య సింహద్వారాన్ని ఇప్పుడు మనం చేరగలిగాము చిరకాల వాంఛిత గమ్యస్థానాన్ని చేరడానికి ఇక ఒక్క అడుగు నడిచేయాలి. ప్రతిదేశంలోనూ బ్రహ్మాండమైన మార్పులు ఏర్పడుతున్నవి. గురుతర కార్యభారం విషయంలో మన కాంగ్రెస్ అధ్యక్షపదవి ప్రపంచంలోని ఏ యితర ఉన్నత పదవికి తీసిపోదు. కాంగ్రెస్ అధ్యక్షుడైన ఏ ఒక వ్యక్తి తన బాధ్యతలను తనంతట తాను ఒంటరిగా నిర్వహించలేడు. సహచరుల సహాయం వుండాలి. మౌలానా సాహెబ్ నాపైన పెట్టిన గురుతర కార్యభారాన్ని నా సహచరుల సహాయంతో నిర్వహించగలనని విశ్వసిస్తున్నాను.

ఇప్పుడు మనం ఆలోచించవలసింది ఒక తీర్మానాన్ని ఆమోదించడమా? నిరాకరించడమా అన్నది కాదు. ప్రస్తుతం ఏర్పడబోతున్న రాజ్యాంగ పరిషత్తులోని ప్రయోజనాలేమిటి? నిష్ప్రయోజనాలేమిటి? అన్న సమస్యకూడా లేదు. దేశస్వాతంత్ర్యమే ముఖ్య సమస్య. గత ఇరవైఐదు సంవత్సరాలలోనూ కోట్లకొలదీ ప్రజలు జాతీయ స్వాతంత్ర్యం సిద్ధిస్తుందనే పరమ విశ్వాసంతో కాంగ్రెసు సంస్థను అనుసరించారు. ఈనాడు మన కాంగ్రెసు ఇదివరకెన్నడూ లేనంతటి బలిష్ఠంగావున్నది. ఐతే, ప్రస్తుతం కాంగ్రెసులో అంతరంగిక దౌర్బల్యం కూడా వున్నదని ఒప్పుకొనక తప్పదు. భారత స్వాతంత్ర్య సాధనకై కృషిచేసే వివిధ దృక్పథాలవారికీ కాంగ్రెసులో స్థానం వున్నది. మన ప్రధాన లక్ష్యమైన స్వాతంత్ర్యాన్ని సాధించే విషయంలో మన అంతరంగిక దౌర్బల్యం అడ్డుపడకుండా చూసుకోవాలి. భారతదేశంలో బ్రిటిషుసామ్రాజ్యాధిపత్యాన్ని గద్దె దించడానికి కృషిచేస్తూనే, మన అంతరంగిక దౌర్బల్యాలను తొలగించుకోవాలి. ఈ కార్యభారాన్ని నిర్వహించవలెనంటే, మనలో సంపూర్ణ ఐకమత్యమూ, మనకు ప్రజాబలమూ వుండడం అవసరం.

భారతదేశంలో బ్రిటిష్ ఆధిపత్యానికి అవసానదశ ప్రారంభమైంది. బ్రిటిష్ ఆధిపత్యమనే అంకసమాప్తిసూచకంగా తెరను దించబోతున్నాము. ఇవి చాలా క్లిష్ట ఘడియలు. ఇట్టి సమయంలో మన బలాన్ని సర్వతోముఖంగా సమీకరించుకోవాలి; దౌర్బల్యాన్ని కనబరచకూడదు. కాబట్టి దౌర్బల్య చిహ్నాలన్నిటినీ పటాపంచలు చేసివేయాలి. ఎప్పటికప్పుడు ఏర్పడే కొత్త సమస్యలను ఎదుర్కొనడానికి మనం సిద్ధపడాలి. మనమందరమూ ఐకమత్యంగాను, బలంగాను వుంటేనే ఇది సాధ్యపడుతుంది.

# టెక్స్టైలు పరిశ్రమ విచారణ కోర్టు

## శ్రీ గిరిగారి ప్రకటన

మదరాసు, జూలై 6: టెక్స్టైలు పరిశ్రమలో పనిచేస్తూన్న కార్మికుల స్థితిగతులనుగూర్చి దర్యాప్తుచేయుటానికి నియమితమైన విచారణకోర్టునుగూర్చి కార్మికమంత్రి శ్రీ వి. వి. గిరిగారు యీ క్రింది విధంగా ఒక ప్రకటనచేశారు.

టెక్స్టైలు పరిశ్రమ పనివారి కష్టనిష్ఠూరాలు స్థితిగతులు సవిమర్శంగా విమర్శించి తెలుసుకోడం చాలా అవసరమూ వాంఛనీయమూ యగుచున్నది. ఇటీవల రెండునెలలలో యీపరిశ్రమయందు అనేక సమ్మెలు తగాదాలు సంభవిస్తూ ఉండడం చేత యీ కార్యం జరగడం మరింత ఆవశ్యకం. పనివారి వేతనాలు జీతాల ప్రమాణాలు ఉద్యోగపు గ్యారంటీలు పనిగంటలు, సెలవు సౌకర్యాలు, బోనసు, ప్రావిడెంటుఫండు, గ్రాచూటీ, ఆసవాంత్రపు ప్రసూతి సౌకర్యాలు, పనివారలకు నివాస సౌకర్యాలు మున్నగు విషయాలనుగూర్చి ప్రభుత్వం సమగ్రమైన విచారణ జరుపదలచియున్నది. ఈ విచారణకర్త ముఖ్య టెక్స్టైలు పరిశ్రమ కేంద్రాలకువెళ్లి యజమానులనుండియు, పనివారినుండియు సాక్ష్యం గైకొనగలడు. ఈలోగా ఏ ట్రేడుయూనియనులుగాని సమ్మెనోటీసులు అందజేసియున్నట్టయితే అట్టి నోటీసులను ఆ సంఘాలు ఉపసంహరించుకొని యీ విచారణ విషయములో తోడ్పడాలని కోరుతున్నాను. పనివారల స్థితిగతులను బాగుపరచే ఉద్దేశ్యంతో ఒక కార్మిక శాసనమును ప్రభుత్వం సాధ్యమైనంత త్వరలో ప్రవేశపెట్టదలచియున్నది. ఇటీవల, కోయంబత్తూరు,తిరుప్పూరు, మెట్టూరు మున్నగుచోటలలో కార్మిక సంఘాల వారి మధ్యపోటీమూలాన కొన్ని హత్యలు కూడా జరిగినవి. భిన్న సూత్రాలపై ఆధారపడు సంఘాలు వ్యవహరించే విషయంలో ఎవరికీ ఆక్షేపణలేదు. అయితే యీ విభేదాలు కలహాలకు హత్యలకు కారకమైతే మాత్రం ప్రభుత్వం తీవ్రమైన చర్య తీసుకోక తప్పదని నేను వారిని హెచ్చరిస్తున్నాను. కార్మికులు, వారినాయకులు యిట్టి అత్యాచారాలను అణచే విషయంలో ప్రభుత్వంతో తోడ్పడవలెనని కోరుతున్నాను.

---

భారతదేశంలో మనం ఈనాడు ప్రమాదభరితమైన ఆర్థికసమస్యలను ఎదుర్కొంటున్నాము. ఒకవైపు క్షామంవచ్చి పీడిస్తున్నది ఇంకొకవైపు దక్షిణాఫ్రికాలో మన ప్రతిష్ఠకు దెబ్బతగిలింది. అక్కడ మన స్వజాతీయులపై విద్వేషభావం విజృంభిస్తున్నది. న్యాయశాస్త్రరీత్యా, రాజ్యాంగరీత్యా గాకపోయినప్పటికీ వాస్తవానికి భారతదేశంలో ఒకభాగమైన సింహళద్వీపంలో మరొకవైపు క్లిష్టపరిస్థితి ఏర్పడింది. వీటన్నిటినీ మనం జాగ్రతగా ఆలోచించుకోవాలి.

ప్రపంచమే నేడు భిన్నభిన్నమైపోతున్నది. నేటి ప్రపంచసంఘటనలకు, ఇటీవలనే ముగిసిన ప్రపంచ యుద్ధానికి సంబంధమేమీ లేదు. మళ్లీ యుద్ధం ఎప్పుడన్నదే ప్రశ్న. భారతదేశ ఆశయం సర్వదా స్వాతంత్ర్యసాధనే. ఫాసిజమునకు నాజిజమునకు మనం శత్రువులం. చిన్నదైనా, పెద్దదైనా ఒక దేశ స్వాతంత్ర్యాన్ని మరొకదేశం అపహరించ చూచుకుంటే అందుకు మనం సమ్మతించము. ప్రతిదేశ స్వాతంత్ర్య హక్కునూ మనం బలపరుస్తాం. ఒక్క భారతదేశ ప్రజలదృష్టిలోనే గాక, సర్వప్రపంచ ప్రజాకోటి దృష్టిలోనూ మన జాతీయ కాంగ్రెసుపై నేడు ఒకవిశిష్టస్థానం లభ్యమైంది.

అచిరకాలంలోనే మనకు స్వాతంత్ర్యం లభ్యమవుతుంది. ఇట్టి స్వాతంత్ర్యం లభ్యం కాగానే, మనం మిగతా దేశాలతో స్నేహసంబంధాలను ఏర్పాటుచేసుకుంటాము. అప్పుడు మనదేశ స్థితిగతులనే గాక, ఇతరదేశాల స్థితిగతులను, పరిస్థితులను కూడా మనం ఆలోచించవలసి వుంటుంది. ఇతరదేశాల పరిస్థితులు కూడా మనలో ముఖ్యమైన మార్పులను తేగలవు. కాబట్టే, వాటినిగురించీ జాగ్రతగా ఆలోచిస్తుండడం అవసరమవుతుంది."

కాంగ్రెసు కార్యవర్గం మంత్రిత్రయంతో రాయబారాలు సాగిస్తున్న కారణంచేత, ఏ. ఐ. సి. సి. సమావేశాన్ని ఇంతకు పూర్వమే జరుపలేక పోయిందని నెహ్రూ కారణంచెప్పాడు. రాయబారాల మధ్యలో ఏ. ఐ. సి. సి. ని సమావేశపరచడానికి వీల్లేకపోయిందనీ; రాయబారాలను ఎప్పుడూ ఉభయదేశాలతరపున కొద్దిమంది ప్రజాప్రతినిధులు మాత్రమే జరపడానికి వీలుంటుందనీకూడా నెహ్రూ విశదీకరించాడు. రాయబారాలు పూర్తి అయి, ఒక నిర్ణయానికి వచ్చిన వెంటనే ఏ.ఐ. సి.సి.ని సమావేశపరిచామనీ, వర్కింగ్ కమిటీ తీర్మానాన్ని ఏ. ఐ. సి. సి. ఆమోదిస్తే ఆమోదించవచ్చుననీ, లేకపోతే స్వేచ్ఛగా నిరాకరించవచ్చునని నూతన రాష్ట్రపతి తెలియజేశాడు.















Edited Printed, & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras.